శ్రీమతే రామానుజాయ నమః

శ్రీకూరనాథాయ నమః



# పంచస్తవి వైభవం

శ్రీకూరత్తాళ్వాన్



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అఴగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయసూచిక





# పంచస్తవి వైభవం

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే,
యదుక్తయః త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్.

విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వసర్వస్వపేటికా,
కూరనాథోదితా పంచస్తవీ భక్తరసాయనమ్.

శ్రీసూక్తిః జయతాత్తరాం సుమధురా సా కూరనాథస్య యా
శ్రుత్యంతద్వయ తత్త్వదర్శనచణా విద్వన్మనోరంజనీ,
లక్ష్మీనాయకరూపవైభవగుణస్తోమస్వరూపాదికాన్
సుస్పష్టం విశదీకరోతి వివిధైః తర్క్యైః ప్రమాణానుగైః.

ఏషోక్తిః జయతాత్తరాం గురువరశ్రీకూరనాథస్య యా
శ్రుత్యంతద్వయశైలకందరలసత్ తత్త్వప్రదీపోపమా,
యాలంకారగుణైః విభూషితవధూసాదృశ్యతో భాసతే
యా సంసారవిషేణ ముగ్ధజనతాసంజీవనీ చాతులా.

## 1. స్తోత్ర సాహిత్యవైలక్షణ్యమ్

ప్రపంచ సాహిత్యంలో అతి ప్రాచీనమైనది, అతి విలక్షణమైనది – సంస్కృత సాహిత్యం. సంస్కృత సాహిత్యంలో ప్రాచీనమైనదిగా, ప్రపంచంలోని సాహిత్యవిమర్శకులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించిన

సాహిత్యం – వేద సాహిత్యం. ఈ వేద సాహిత్యంలో, మొదటి ఆవిర్భావంగా అందరూ అంగీకరించినది – ఋగ్వేదం. ఈ ఋగ్వేదం అనేది పలు దేవతలను స్తుతించే,ఋక్కులు అనబడే సూక్తాల సమాహారం. "ఋచ– స్తుతౌ" అనే ధాతువు నుండి పుట్టిన ఋక్ శబ్దానికి స్తోత్రం– అని అర్థం. అందువల్ల ప్రపంచ వాఙ్మయావిర్భావం అనేది స్తోత్రవాఙ్మయంతోనే ఆరంభమైనదని తెలుస్తున్నది.

ఈ విధంగా ఋగ్వేదంతో ఆరంభమైన ఈ స్తోత్ర వాఙ్మయం, కాలక్రమేణ అన్ని మతాలలోనూ, అన్ని సంప్రదాయాలలోనూ విశ్వరూపాన్ని ధరించి, విస్తరించినది. లోకంలో కావ్యాలను తెలియని వారు ఉంటే ఉండవచ్చునేమో కానీ, తాము ఆరాధించే ఇష్టదేవతలను స్తుతించే శ్లోకాలను, కనీసం ఒకటి రెండిటిని తెలియనివారు ఉండరు అనే విషయం యథార్థం. విచిత్రం ఏమంటే, వైదిక సంప్రదాయాలలోనే కాకుండా, అవైదిక మతాలుగా పరిగణింపబడే బౌద్ధ జైనాది మతాలలో కూడా ఈ స్తోత్రవాఙ్మయం అపారంగా ఆవిర్భవించినది. ఈ స్తోత్ర సాహిత్యాన్ని పరిశీలించి చూస్తే, ప్రధానంగా, కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి మార్గాలను సాధనంగా గ్రహించి, తాము ఆరాధించే దేవతలను పొందడం కోసం స్తోత్రాలను రచించినట్లు కనిపిస్తుంది. లౌకిక ప్రయోజనాల ఆశించి రచింపబడిన స్తోత్రాలు కూడా చాలా ఉన్నాయి. నవ విధ భక్తులలో ఒకటి అయిన కీర్తనమనే భక్తి ప్రకారం స్తుతించడమే అని చెప్పవచ్చు. పై పైన చూసినప్పుడు, స్తోత్రం అనేది వాచికమైన వ్యాపారంగా మాత్రమే కనిపించినప్పటికీ, ఆ స్తోత్రాన్ని రచించేటప్పుడు కానీ, లేక, స్తోత్రాలను పఠించేటప్పుడు కానీ, భక్తుని మనసు భావా వేశాన్ని పొంది స్పందిస్తుంది కనుక, అప్రయత్నంగానే తమ ఇష్ట దేవతలను ఉద్దేశించి ప్రదక్షిణ నమస్కారాలను చేయడం, మనసులో

ద్రవించడం కూడా సంభవమే కనుక, స్తోత్రం అనేది త్రికరణాత్మకమైనది అని చెప్పవచ్చు.

వేదోప్బృంహణాలుగా కీర్తింపబడే పురాణేతిహాస సాహిత్యంలోకూడా ఈ స్తోత్ర వాఙ్మయం ప్రముఖస్థానాన్ని అలంకరిస్తున్నది. అయితే, ఈ సాహిత్యంలో ఉండే స్తోత్రాలు కేవలం ఆ యా దేవతలను స్తుతించడంతో మాత్రమే పర్యవసించకుండా, ఆయా శాస్త్రార్థప్రతిపాదకాలుగా కూడా భాసించడాన్ని గమనించవచ్చు.

## 2. స్తోత్రప్రకారాలు

స్తోత్రాలు కూడా, "ద్రవ్య స్తోత్రం కర్మ స్తోత్రం విధి స్తోత్రం తథైవ చ, తథైవాభిజన స్తోత్రం స్తోత్ర మేతత్ చతుర్విధమ్" అని, ద్రవ్య స్తోత్రాలు అని, కర్మ స్తోత్రాలు అని, విధి స్తోత్రాలు అని, అభిజన స్తోత్రాలు అని నాలుగు విధాలుగా ఉంటాయి – అని మత్స్యపురాణం వర్గీకరించి పలికింది. యజ్ఞ యాగాదులలో భగవంతునకు సమర్పించే పవిత్ర ద్రవ్యాలను స్తుతించేది ద్రవ్య స్తోత్రం, యగాదిక్రియాలలో ఆరాధన కర్మలను కీర్తించే స్తోత్రాలు కర్మ స్తోత్రాలు. "ఈ విధంగా చేయాలి, ఆ విధంగా చేయాలి, దీనిని చేయాలి, దానిని చేయాలి" – అని విధిపూర్వకంకంగా ఉండే స్తోత్రాలు విధి స్తోత్రాలు. ఆ యా వంశాలను, ఆ వంశాలలో జన్మించిన మహా పురుషులను కీర్తించే స్తోత్రాలు అభిజన స్తోత్రాలు.

కూరేశులు శ్రీ స్తవంలో, పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవం అనే స్తోత్రంలో వేరొక విధమైన స్తోత్ర వర్గీకరణను చేశారు. స్తోత్రం అంటే, ఒకరిలో ఉండే గుణాలను ఇంకొకరిలో ఆరోపించి చెప్పడం ఒక విధమైన స్తోత్రం అని, ఉన్న గుణాలను ఉన్నట్లుగా, అందంగా చెప్పడం కూడా ఇంకొక విధమైన స్తోత్రమని, ఈ విధంగా వారు రెండు విధాలైన స్తోత్ర ప్రకారాలను నిర్వచించారు. అయితే, భగవంతునిలో లేని గుణం అనేది లేదు కనుక, ఉండే

గుణాల అతిశయం కూడా పరిమితికి మించినది కనుక, ఈ రెండు విధాలయిన స్తోత్ర ప్రకారాలు భగవంతుని విషయంలో అసాధ్యాలే అయినప్పటికీ, స్తుతి కర్తలు తమ తమ వాక్కులను శుద్ధి చేసుకోవడం కోసంగా, తమ జన్మలను పవిత్రం చేసుకోవడం కోసంగా స్తోత్ర రచనలను చేయడం జరుగుతున్నదని అన్నారు.

## 3. స్తోత్రప్రక్రియావైవిధ్యం

ఈ స్తోత్రాలు, శ్లోకరూపాలుగా, గద్య రూపాలుగా, గద్య పద్య మయాలైన చంపూరూపాలుగా కూడా ఉంటాయి. స్తోత్రాలలో ఉండే శ్లోకసంఖ్యను బట్టి కూడా ద్వయం, త్రయం, చతుఃశ్లోకి, అష్టకం, దశకం, వింశతి, పంచాశత్, షష్ఠిక, సప్తతి,శతకం, సహస్రం – అని అనేక విధాలుగా ఈ స్తోత్రాలు ఉంటాయి.

## 4. విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయ స్తోత్రసాహిత్యం

ద్వైతాద్వైతాది సంప్రదాయాలలో, ఆ యా సంప్రదాయాలకు అనుగుణంగా స్తోత్రాలు వెలసినట్లే, విశిష్టాద్వైత శ్రీవైష్ణవ సంప్రదాయంలో కూడా లెక్కకు మించి ఎన్నో స్తోత్రాలు ఆవిర్భవించాయి. వేదాలలో, వాటి ఉపబృంహణాలయిన పురాణేతిహాసాలలో విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వ ప్రతిపాదకాలైన సూక్తాలు, స్తోత్రాలు చాలా గోచరిస్తూ ఉన్నప్పటికీ, శ్రీవైష్ణవ పూర్వాచార్యగురుపరంపరాక్రమాన్ని బట్టి చూస్తే, ఇప్పుడు మనకు లభించే స్తోత్రాలలో కుల శేఖరుల ముకుంద మాలా స్తోత్రం మొట్టమొదటిది అని చెప్పవచ్చు. అంతకు ముందు, ఆళ్వారుల పరంపర ఉన్నప్పటికీ, వారు సంస్కృత భాషలో రచించిన స్తోత్రాలు ఏవీ లభ్యం కావడం లేదు. రచించిన

ఆధారాలు కూడా దొరకడం లేదు అందువల్ల ముకుంద మాలాస్తోత్రమే మొదటిదిగా భావించవచ్చు.

దీనికి తరువాత, శ్రీవైష్ణవ సంప్రదాయ గురుపరంపర నాథమునులతో ఆరంభమైనప్పటికీ, శ్రీయామునాచార్యులవారు అనుగ్రహించిన కాంతాచతుఃశ్లోకి, స్తోత్ర రత్నం అని ప్రసిద్ధి చెందిన ఆళవందార్ స్తోత్రం అనే రెండు స్తోత్రాలు పూర్వాచార్య ప్రణీతాలైన స్తోత్రాలలో ప్రాచీనమైనవి అని భావించవలసి ఉన్నది. వీటికి పిమ్మట గణింపదగినవి– కాంచీపూర్ణుల దేవరాజాష్టకం, భగవద్రామానుజుల గద్యత్రయం. దీనికి పిమ్మట శ్రీకూరేశుల పంచస్తవి పేర్కొ్న దగినది. ఇది, శ్రీ వైకుంఠస్తవం అతిమానుషస్తవం, శ్రీసుందరబాహుస్తవం, శ్రీ వరదరాజస్తవం, శ్రీస్తవం – అనే ఐదు స్తోత్రాల సమాహారం.

## 5. శ్రీవైష్ణవ సంప్రదాయ స్తోత్ర స్వరూప స్వభావాలు

ఇక, శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందిన పూర్వాచార్య ప్రణీతాలైన స్తోత్రాల స్వరూపాన్ని గమనించినట్లయితే, అవి, శ్రీవైష్ణవసిద్ధాంత సంప్రదాయానుసారంగా రచింపబడి ఉండడాన్ని గమనించవచ్చు. ఈ సంప్రదాయంలో అన్య దేవతారాధనా ప్రసక్తి ఉండదు కనుక, అన్యదేవతల స్తుతి వీటిలోఎక్కడా కనిపించదు. శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని నమ్మిన సిద్ధాంతం కనుక, సంప్రదాయం కనుక, దానికి అనుగుణంగా స్తోత్రాలు ఉంటాయి. . ఈ సిద్ధాంతంలో, భగవానుడైన శ్రీమన్నారాయణుడు అంతు లేని స్వరూప రూప కల్యాణ గుణ విభూతి లీలలను కలిగినవాడని చెప్పబడుతున్నది కనుక, తదనుగుణంగానే ఈ స్తోత్రాల నిర్మాణం ఉంటుంది.

## పంచస్తవి వైభవం

ఈ సంప్రదాయంలో శరణాగతి అనేది ప్రధానమైన మోక్షోపాయంగా చెప్పబడినందున, శరణాగతి తత్త్వస్వరూపం శ్రీవైష్ణవ స్తోత్రలలో విపులంగా వర్ణింపబడుతుంది. భగవంతుని, ప్రపత్తి అనే ఉపాయం ద్వారా ఆశ్రయించడం కూడా, సదాచార్య పూర్వకంగానే చేయాలి కనుక, ఆయా ఆచార్యులకు సంబంధించిన వైభవ ప్రస్తావన కూడా ఇందులో ఉంటుంది. అంతేకాదు, కొన్ని స్తోత్రాలు అయితే, ప్రత్యేకంచి, పూర్వాచార్యుల వైభవాన్ని తెలియజేసేవిగా కూడా రచింపబడడం గమనించవచ్చు. భగవచ్ఛేషత్వం అనేది జీవుని స్వరూప నిరూపక ధర్మంగా, లక్ష్మీ సహితుడైన నారాయణుడు ఉపాయంగా, ఆ లక్ష్మీ నారాయణులనే దివ్య దంపతులకు అభిమతమైన సేవయే పరమపురుషార్థంగా శ్రీ వైష్ణవ సిద్ధాంతంలో నిర్ణయించి చెప్పబడినందున, ఈ తత్త్వాల ప్రతిపాదన శ్రీవైష్ణవ స్తోత్రాలలో స్పష్టంగా కనిపిస్తుంది. పైన తెలిపిన జీవుని స్వరూప ఉపాయ పురుషార్థాలు భగవంతుని వరకే కాకుండా, ఆ భగవంతుడు మిక్కిలి ఇష్టపడే భాగవతుల వరకు, వారిలో విశేష స్థానాన్ని అలంకరించే సదాచార్యుల వరకు కూడా కొనసాగుతాయి– అని కూడా ఈ సిద్ధాంతంలో చెప్పబడినందున, ఈ భావనలు కూడా ఈ స్తోత్రాలలో గోచరిస్తాయి.

శ్రీవైష్ణవ సిద్ధాంత తత్త్వాలకు మూలం – రహస్య త్రయం అనబడే అష్టాక్షరీ మహా మంత్రం, ద్వయ మంత్రం, శ్రీకృష్ణ చరమ శ్లోకం– అనే మూడు. ఈ మూడు రహస్యాల వివరణ రూపాలే ఆళ్వారుల దివ్య ప్రబంధాలు అని కూడా శ్రీవైష్ణవ సిద్ధాంతంలో భావింపబడుతున్నది. అందువల్ల. శ్రీవైష్ణవ సంప్రదాయ స్తోత్రాలలో ఈ మూడు రహస్యాల లోని అర్థాల ప్రతిపాదన ప్రస్ఫుటమవుతుంది. విశేషించి గమనించవలసిన విషయం ఏమంటే, ఈ మూడు రహస్యాలలో కూడా సర్వదా అనుసంధించదగిన మంత్రం

ద్వయమంత్రమే కనుక, ప్రధానంగా ఈ మంత్ర వివరణ రూపాలుగానే స్తోత్రాలను పూర్వాచార్యులు దర్శించారు, వ్యాఖ్యానించారు కూడా.

## 6. శ్రీవైష్ణవ సంప్రదాయంలో స్తోత్రాల స్థానం

శ్రీవైష్ణవ సంప్రదాయంలో పూర్వాచార్యకృత స్తోత్రాలకు ప్రముఖస్థానం ఉన్నది. శాస్త్ర గ్రంథాలలో ఉండే సారమైన తత్త్వాలను స్తోత్రరూపాలుగా పూర్వాచార్యులు రచించినందువల్ల, ఆ విధంగా వారు రచించేటప్పుడు సంస్కృత వేద సూక్తులలోని అర్థాలను, ద్రావిడ వేదం అని ప్రసిద్ధి చెందిన ఆళ్వారుల దివ్యప్రబంధాలలోని భావనలను మేళవించి, ఆ స్తోత్రాలను వారు వెలయించినందున, పూర్వాచార్యుల స్తోత్ర సాహిత్యానికి చాలా ప్రముఖమైన స్థానం ఇవ్వబడింది. కొన్ని స్తోత్రాలను నిత్యం అనుసంధించవలసిన స్తోత్రాలుగా కూడా పెద్దలు నిర్ణయించి తెలిపారు. కొన్ని దివ్యదేశాలలో అయితే, పూర్వాచార్యప్రణీతాలైన కొన్ని స్తోత్రాలు కొన్ని విశేష సందర్భాలలో, ఉత్సవ సమయాలలో అనుసంధింపబడతాయి. అందువల్ల వీటికి, వేద, ద్రావిడ వేదాలతో సమానమైన స్థానాన్ని మన పూర్వాచార్యులు ఇచ్చినట్లు స్పష్టం అవుతున్నది.

## 7. శ్రీకూరేశుల పంచస్తవి

కూరత్తాழ్వాన్ అని, ఆழ్వాన్ అని సంప్రదాయంలో ప్రసిద్ధులైన శ్రీకూరేశులు కాంచీపురానికి సమీపంలో ఉండే కూరం అనే అగ్రహారంలో, క్రీస్తు శకం 1008వ సంవత్సరంలో, పుష్య మాసంలో హస్తా నక్షత్రంలో, శ్రీమదనంత భట్టారకులకు కుమారులుగా జన్మించారు. శ్రీ వైష్ణవసంప్రదాయంలో, వీరు శ్రీరామచంద్రుని అంశగా అవతరించారు అని

భావింపబడుతున్నారు. త్రేతాయుగంలో శ్రీమన్నారాయణుడు శ్రీరామచంద్రునిరూపంలో అవతరించినప్పుడు, ఆదిశేషుడు లక్ష్మణుని రూపంలో అవతరించి, ఆ స్వామికి సర్వవిధ సేవలను సర్వకాలాలలో చేసినందున, చాలా ప్రీతుడైన భగవానుడు, ఈ కలియుగంలో తాను కూరేశులుగా అవతరించి, ఆదిశేషులను శ్రీరామానుజులుగా అవతరింపజేసి, రామానుజులకు అంతరంగ శిష్యులై, సర్వవిధ కైంకర్యాలను చేసి తన మనోరథాన్ని తీర్చుకున్నాడు – అని సంప్రదాయంలోని విశ్వాసం. కూరేశులకు శ్రీవత్సాంకులు అనే పేరు కూడా సంప్రదాయంలో ప్రసిద్ధి చెందింది.

వేదేతిహాస పురాణాది సకల శాస్త్రాలలో సాటి లేని మేటి వైదుష్యాన్ని, విశేషించి, సంస్కృత వ్యాకరణ శాస్త్రంలో అనన్య సాధ్యమైన పాండిత్యాన్ని కలిగిన కూరేశులు పండితులచే "నడిచే పతంజలి"గా స్తుతింపబడ్డారు. దానికి తోడు, మృదుమదురమైన కవితాప్రణయన శక్తి కూడా వీరికి సహజ సిద్ధంగానే ఏర్పడింది. సహజంగానే వీరు చాలా మృదువైన, కరుణాపూర్ణమైన స్వభావం కలిగివారు. అంతు లేని ఆత్మ గుణ సంపత్తిని కలవారు. ఆళ్వారుల దివ్యప్రబంధాలలో పరిపూర్ణంగా అవగాహన కలిగినవారు. ఈ విశేషాలు అన్నీ వీరి పంచస్తవిలో మనకు అడుగడుగునా గోచరిస్తాయి. సంస్కృత వ్యాకరణంలో తలస్పర్శి అయిన పాండిత్యాన్ని కలిగిన పండితులు మాత్రమే అవగాహించగలిగిన అపూర్వమైన శబ్ద ప్రయోగాలు, చాలా మధురమైన భావనలు, ఇంచుమించుగా ప్రతి శ్లోకంలోనూ ఆళ్వారుల పాశురాలలోని అందమైన భావనలు, వివిధాలంకార ప్రయోగ వైచిత్రి, ఉక్తి చమత్కారాలు మొదలైన అపూర్వమైన అంశాలతో వీరి పంచస్తవి సాహిత్య మర్మజ్ఞులకు, రసజ్ఞులకు షడ్రసోపేతమైన విందు అని అనడంలో ఏ సందేహం లేదు. ప్రత్యేకించి, కూరేశుల నైచ్యానుసంధానం చాలా ప్రసిద్ధమైనది. ఈ విషయాన్ని తిరువరంగత్తముదనార్ అనే పూర్వాచార్యులు ఒకరు

ఇరామానుశనూత్తందాది ప్రబంధంలో "**మొళియై క్కడక్కుమ్ పెరుమ్ పుగళాన్ వంజ ముక్కుఱుంబామ్ కుళియై క్కడత్తుమ్ న్ నమ్ కూరత్తాళ్వాన్**" అని, శ్రీవరవరమునులు శ్రీయతిరాజ వింశతి స్తోత్రంలో "**వాచామ గోచర మహాగుణ దేశికాగ్ర్య కూరాధినాథ కథితాఖిలనైచ్యపాత్రమ్**" అని అన్నారు కదా! (నైచ్యానుసంధానం అంటే, భగవంతుని సన్నిధిలో భక్తుడు తన తక్కువదనాన్ని, ఏ మంచి గుణం లేకపోవడానికి విజ్ఞాపన చేయడం)

## 8. పంచస్తవీ రచనాక్రమం

శ్రీకూరేశులు రచించిన పంచస్తవి అనబడే ఐదు స్తోత్రాల సంపుటి రచనాక్రమం విషయంలో పండితుల మధ్య అభిప్రాయ భేదం ఉన్నట్లు కనిపిస్తుంది. కొంతమంది, భగవంతుని ఆశయించడం అనేది లక్ష్మీపురుషకారపురస్సరంగా చేయాలి కనుక, కూరేశులు శ్రీస్తవంనుండి ఆరంభించి, వరదరాజస్తవంతో ఐదు స్తోత్రాల రచనను పూర్తి చేశారు – అని భావించగా, మరి కొంతమంది, ఈ స్తోత్రాల రచనకు కారణం చోళ రాజు సభలో జరిగిన ఘోరమైన సంఘటన కనుక, ఆ సంఘటన వల్ల తమ మనసులో ఏర్పడిన ఆర్తిని, బాధను వ్యక్తం చేస్తూ కూరేశులు శ్రీవైకుంఠస్తవంనుండి ఆరంభించి, శ్రీస్తవంతో పూర్తి చేశారు – అని భావించారు. కాంచీ మహావిద్వాన్ శ్రీమాన్. ప్ర. భ. అణ్ణంగరాచార్య స్వామివారు కూడా ఈ క్రమాన్నే అంగీకరించారు.

పంచస్తవిని వ్యాఖ్యానించిన వ్యాఖ్యాతలలో కూడా ఈ అభిప్రాయ భేదం కనిపిస్తున్నది. శ్రీనివాసాచార్య వ్యాఖ్యానక్రమం శ్రీవైకుంఠస్తవం నుండి ఆరంభం కాగా, గార్గ్య రామానుజాచార్య వ్యాఖ్యానం శ్రీస్తవంతో ఆరంభం అవుతున్నది.

# 9. పంచస్తవిలో వైదిక తత్త్వాల ఆవిష్కారం

శ్రీ కూరేశులు వైదికాగ్రేసరులు, వేదార్థ హృదయాన్ని పూర్ణంగా గ్రహించినవారు కనుక, వారి సూక్తులలో అడుగడుగునా వేద తత్త్వాల ఆవిష్కరణ మనకు పదే పదే దర్శనం ఇస్తుంది. . ఉదాహరణకు, ఒకటి, రెండు సందర్భాలను మాత్రం ప్రస్తావిస్తాను.

వేదంలో–

**"అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్,**
**శుక్రేణ జ్యోతీగ్ం షి సమనుప్రవిష్టః ప్రజాపతిః చరతి గర్భే అంతః"**

అని భగవంతుని రూపాలు పర వ్యూహ విభవ అంతర్యామి అర్చా ప్రకారాలతో ఐదు విధాలుగా ఉంటాయి – అని పేర్కొన్నది. . పాంచరాత్ర శాస్త్రం కూడా ఈ క్రమాన్ని అనుసరించింది. ఆళ్వారులూ ఈ క్రమాన్ని కీర్తించారు. ఈ ఐదు విధాలయిన భగవంతుని రూపాలనుగూర్చి కూరేశులు అతిమానుషస్తవంలో, సుందరబాహుస్తవంలో, వరదరాజస్తవంలో విపులంగా ప్రస్తావించడాన్ని చూడవచ్చు. వేదం,

**"యద్వేదాథౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః,**
**తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః"**

అని ప్రణవానికి మూలం అకారం అని, ఆ అకారం భగవంతుని వాచకమని తెలిపింది. ఈ అర్థాన్నే గీతాచార్యుడు కూడా **"అక్షరాణా మకారోస్మి"** అని, పాంచరాత్రాగమానికి చెందిన పాద్మసంహిత, చర్యాపాదంలో **"అకారో విష్ణురుచ్యతే"** అని, ఆళ్వారులు **"తుళక్కమిల్ విళక్కమాయ్"** అని అనువదించగా, ఈ తత్త్వాన్ని కూరేశులు శ్రీ వైకుంఠస్తవంలో(19) **"వేదాత్మక ప్రణవ కారణ వర్ణవాచ్యం తం త్వాం వయం తు పరమేశ్వర మామనామః"** అనే సూక్తి ద్వారా అనుసంధించారు. ఎన్నో

శ్రుతి వాక్యాలను శబ్దతః యథాతథంగాను, అర్థతః అనువధిస్తూ కూరేశులు పంచస్తవిలో ప్రస్తావించిన వైనం ఆస్తికులకు సుస్పష్టంగా గోచరిస్తుంది. అస్తు.

## 10. కూరేశుల పంచస్తవిపై ఆళ్వారుల సూక్తుల ప్రభావం

పంచస్తవిలో కూరేశులు అనుగ్రహించిన ఎన్నో శ్లోకాలలో అళ్వారుల సూక్తుల ప్రభావం చాలా స్పష్టంగా కనిపిస్తుంది. అతిమానుషస్తవంలో కూరేశులు త్రివిక్రమావతార, శ్రీరామావతార, కృష్ణావతారాలలోని పలు దివ్యభవ్యలీలలను ప్రస్తావిస్తూ, చాలా చమత్కారంగా ప్రశ్నలను భగవంతుని ఉద్దేశించి సంధిస్తారు. వీటికి మూలం ఆళ్వారుల సూక్తులే అని నిశితంగా గమనించినప్పుడు మనకు తెలుస్తుంది. ఉదాహరణగా, ఒకటి, రెండు సందర్భాలను ప్రస్తావించడం జరుగుతున్నది.

సరోయోగి అనే పొయ్ గై ఆళ్వారులు ముదల్ తిరువందాది అనే ప్రబంధంలో భగవంతుని ఉద్దేశించి ప్రశ్నిస్తూ,

**“పాలన్ తనదురువాయ్ ఏ౻లకుండు, ఆలిలైయిన్**
**మేలన్రు నీ వళర్ న్ద మెయ్యెన్బర్– ఆలన్రు**
**వేలై నీరుళ్ళదో? విణ్ణదో? మణ్ణదో?**
**శోలైశూ౻ కున్రెడుత్తాయ్! శొల్లు”**(69)

(తోటలను నిండుగా కలిగిన గోవర్ధన పర్వతాన్ని ఎత్తిన ఓ స్వామీ! నీవు ప్రళయ సమయంలో చిన్న బాలుని రూపాన్ని ధరించి, నీ చిన్న బొజ్జలో సప్త లోకాలను ఆరగించి, లేత మర్రి చిగురుటాకుపై శయనించిన వృత్తాంతం వాస్తవమని విజ్ఞులైన మహనీయులు అంటున్నారే? మరి, అన్నీ లయం అయిన సమయంలో, ఆ మర్రి చిగురుటాకు ఎక్కడ నుండి వచ్చింది? అది, ప్రళయ

సముద్రంలో ఉన్నదా? ఆకాశంలో ఉన్నదా? భూమిలో ఉన్నదా? నా సందేహానికి బదులు చెప్పు)

అని చాలా చమత్కారంగా అన్నారు. ఇక్కడ, ఈ దివ్య సూరి అడిగిన ప్రశ్నలోనే సమాధానం ఇమిడి ఉన్నది – అని మన పూర్వాచార్యుల మధురమైన వివరణం. ఏడు దినాలపాటు, ఏ అడ్డు లేకుండా, తోటలు నిండుగా ఉండే గోవర్ధన పర్వతాన్ని తన చిటికెన వేలుపై నిలిపి, గొడుగుగా పట్టుకున్న అఘటిత ఘటనా సమర్థుడవు నీవు కనుక, ప్రళయ సమయంలో కూడా అన్ని లయం అయిన అప్పుడు కూడా, లేత మర్రి ఆకును సృష్టించగలిగావు –అనే సమాధానం అళ్వార్లు చేసిన "**శోలై శూళ్ కున్టెడుత్తాయ్!**" అనే సంబోధనలోనే ఉన్నదని మన పూర్వాచార్యుల అద్భుతమైన వివరణం.

ఇటువంటి చమత్కారకరమైన ప్రశ్ననే కూరేశులు అతిమానుషస్తవంలో భగవంతుని ఉద్దేశించి చేశారు. త్రివిక్రమావతార సందర్భంలో జరిగిన ఒక దృశ్యాన్ని ప్రస్తావిస్తూ, కూరేశులు అతిమానుసస్తవంలో,

**"త్వన్నిర్మితా జఠరగా చ తవ త్రిలోకీ**
**కిం భిక్షణాదియ మృతే భవతా దురాపా?,**
**మధ్యే కదా తు న విచక్రమిషే జగచ్చేత్**
**త్వద్విక్రమైః కథ మివ శ్రుతి రంచితా స్యాత్?"**(16)

(స్వామీ! నీచేతనే సృష్టింపబడినవి, ఒకానొక సమయంలో, అంటే, ప్రళయసమయంలో, నీ ఉదరంలో ఉండి రక్షణను పొందినవి అయిన ఈ ముల్లోకాలను మహాబలి దగ్గర నీవు యాచించి పొందితే తప్ప, ఇంకొక ఉపాయం వల్ల నీకు లభించడానికి వీలు కాదా ఏమి? మరి, ఎందుకు ఈ

విధంగా నీవు నీ సొత్తు అయిన భూమిని బలి దగ్గర యాచించి పొందావు? అని అంటే, ఆ విధంగా బలి దగ్గర దానంగా మూడు అడుగులను నేలను పొంది, ఒక అడుగుతో భూమిని, వేరొక అడుగుతో పై లోకాలను నీవు కొలిచి ఉండకపోతే, వేదం నీ ఈ లీలను కీర్తించి ఉండేది కాదు. ఆ విధంగా అది కీర్తించకపోతే, నీ విక్రమాలను కీర్తించడం అనే విలక్షణమైన లక్షణాన్ని వేదం పొందగలిగి ఉండేది కాదు కదా ఆ విధంగా కాకుండా, వేదం నిన్ను కీర్తించింది అనే అతిశయాన్ని పొందడం కోసమే నీవు ఆ విధంగా బలి దగ్గర యాచించి, నీ సొత్తు అయినప్పటికీ, భూమిని దానంగా బలి చక్రవర్తి దగ్గర యాచించి పొందావు)

అనే శ్లోకాన్ని అనుగ్రహించారు.

ఇటువంటి అందమైన, రమణీయమైన సాభిప్రాయకమైన ప్రశ్నలను ఎన్నిటినో ఆ స్తుతిలో గమనించవచ్చు. విస్తరణ భీతితో ఇంతటితో ఈ విషయం నిలుపబడుతున్నది.

కూరేశులు సుందర బాహు స్తవ, వరదరాజస్తవాలలో భగవానుని దివ్య మంగళ విగ్రహ వర్ణనను చేసేటప్పుడు, వారు వ్యక్తం చేసిన భావాలకు, నమ్మాళ్వారుల తిరువాయి మొ*ழி* ప్రబంధంలోని "**ఏ*ழ*యరావి**" (7–7) అనే దశకం లోని పాశురాలలో వారు అభివ్యక్తం చేసిన భావాలే మూలం అని స్పష్టపడుతుంది. ఈ విషయాన్ని అణ్ణంగరాచార్య స్వామివారు ఆ యా శ్లోకాల వ్యాఖ్యానాలలో సప్రమాణంగా నిరూపించారు.

## 11. శ్రీకూరేశుల పంచస్తవి పై పూర్వాచార్యుల సూక్తి ప్రభావం

శ్రీ కూరేశులు అనుగ్రహించిన పంచస్తవిని గమనించి చూచినప్పుడు, దాని రచనలో, వారికి ముందు శ్రీయామునులు అనుగ్రహించిన స్తోత్రాల ప్రభావం, కాంచీపూర్ణుల దేవరాజాష్టక ప్రభావం, సమకాలీనులైన

శ్రీరామానుజుల గద్యత్రయంలోని సూక్తుల ప్రభావం ఉన్నదని భావించే అవకాశం ఎంతయినా ఉన్నది.

శ్రీ కూరేశులు తమ పంచస్తవిలో ఆవిష్కరించిన నైచ్యానుసంధానానికి మూలం– శ్రీయామునులు స్తోత్ర రత్నంలో అనుగ్రహించిన "**న ధర్మనిష్ఠో ఽ స్మి నాచాత్మవేదీ**"అని మొదలైన సూక్తులే అని తెలుస్తున్నది. శ్రీవరవరమునులు దీనిని సూచిస్తూ, శ్రీయతిరాజ వింశతిలో "**శుద్ధాత్మ యామున గురూత్తమ కూరనాథ భట్టాఖ్య దేశిక వరోక్త సమస్త నైచ్యమ్**" అని అన్నారు.

ఆ విధంగానే "**మకుట ముకుట మాలోత్తంస**" ఇత్యాదిగా సుందర బాహుస్తవంలో కూరేశులు అనుగ్రహించిన దివ్యాభరణ దివ్యాయుధవర్ణనలకు ఆధారం "స్ఫురత్కిరీటాంగద" అని మొదలవుతున్న స్తోత్ర రత్నంలోని యామునుల సూక్తి అని చెప్పవచ్చు. ఆ విధంగానే, కూరేశుల శ్రీస్తవం యామునుల చతుఃశ్లోకికి వివరణ రూపమే అని పెద్దల భావన.

కాంచీపూర్ణుల దేవరాజాష్టకంలోని "**త్వదీక్షణ సుధాసింధు వీచివిక్షేపశీకరైః, కారుణ్య మారుతానీతైః శీతలై రభిషించ మామ్**" అనే సూక్తిని అనుసరిస్తూ కూరేశులు వరదరాజస్తవంలో–

"**ఇమం జనం హంత కదాభిషేక్ష్యతి–– వీక్షణ వీచి సంతతిః**" అనే శ్లోకాన్ని అనుగ్రహించారు.

ఇక, శ్రీరామానుజుల సూక్తి ప్రభావం పంచస్తవిలో సర్వత్రా గోచరం అవుతుంది. శ్రీరామానుజులు శరణాగతి గద్యలో ఆరంభంలో "**దేవదేవ దివ్యమహిషీమ్–– శరణ మహం ప్రపద్యే**" అని శరణాగతి చేయగా, దీనిని అనుసరిస్తూ కూరేశులు శ్రీస్తవంలో "**తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః**" అని లక్ష్మీశరణాగతి చేశారు. శ్రీరామానుజులు శరణాగతిగద్యలో భగవదపచార – భాగవతాపచార –అసహ్యాపచారాలు –

అని మూడు విధాలైన అపచారాలను ప్రస్తావించగా, దీనిని కూరేశులు అతిమానుషస్తవంలో **"అద్యాపి నాస్త్యుపరతిః త్రివిధాపచారాత్"** అని మూడు విధాలయిన అపచారాలను పేర్కొన్నారు.

ఇవి కేవలం ప్రాయికంగా ప్రస్తావించిన ఉదాహరణలు మాత్రమే. ఇటువంటివి చాలా ఉన్నాయి.

## 12. భట్టర్ సూక్తులపై కూరేశుల పంచస్తవి ప్రభావం

శ్రీపరాశర భట్టర్ అనుగ్రహించిన శ్రీరంగరాజస్తవం పూర్వోత్తర శతకాలను ఉండే శ్లోకాలను గమనిస్తే, ఆ శ్లోకాలలో పంచస్తవిలో కూరేశులు అనుగ్రహించిన శ్లోకాలలోని పోకడలు ఉన్న విషయం విశదం అవుతుంది. మచ్చుకు, ఒకటి, రెండు ఉదాహరణలు.

కూరేశులు సుందర బాహుస్తవంలో, వరదరాజస్తవంలో భగవానుని దివ్యమంగళ విగ్రహవర్ణనను చేసేటప్పుడు, ఆ వర్ణనను కిరీటాది నూపురాంతంగా చేశారు. ఇదే క్రమాన్ని భట్టర్ కూడా శ్రీరంగరాజస్తవం పూర్వశతకంలో అనుసరించడం చూడవచ్చు.

కూరేశులు శ్రీస్తవంలో స్తోత్రశబ్దాన్ని నిర్వచిస్తూ,

**"స్తోత్రం నామ కిమామనంతి కవయో యద్యన్యదీయాన్ గుణాన్**
**అన్యత్ర త్వసతో ౨ ధిరోప్య ఫణితిః సా తర్హి వంధ్యా త్వయి,**
**సమ్యక్ సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ**
**వాగ్వాచస్పతినా ౨ పి శక్యరచనా త్వత్సద్గుణార్ణోనిధౌ."**

అని అంటూ ప్రస్తావించిన రెండు విధాలయిన స్తోత్ర భేదాలను పరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవం పూర్వ శతకంలో(19)

**"అన్యత్రాతద్గుణోక్తిః భగవతి న తదుత్కర్షచౌర్యైః పరేషాం**
**స్తుత్యత్వాద్యావదర్థాః పణితిరపి తస్య నిస్సీమకత్వాత్"**
అనే శ్లోకంలో భంగ్యంతరంలో ప్రస్తావించారు.

శ్రీ స్తవంలో కూరేశులు "**లోకే వనస్పతి బృహస్పతి తారతమ్యం యస్యాః ప్రసాద పరిణామ ముదాహరంతి**" అని అంటూ లక్ష్మీదేవి కటాక్షంలోని వ్యత్యాసమే లోకంలో ప్రాణుల మధ్య ఉండే హెచ్చుతగ్గులకు కారణం— అని అన్నారు. ఇదే భావాన్ని ప్రకటిస్తూ భట్టర్, శ్రీగుణ రత్న కోశం అనే స్తోత్రంలో "**ఆకుగ్రామ నియామకాదపి విభో రాసర్వనిర్వాహకాత్, ఐశ్వర్యం యదిహోత్తరోత్తర గుణం—– యత్తదశ్చ వీక్షణభువః తే పంచషా విప్రుషః**" అనే శ్లోకంలో అందంగా అనువదించారు. ఇటువంటి ఉదాహరణలు ఇంకా చాలా ఉన్నాయి.

ఈ విధంగానే శ్రీవేదాంతదేశికులు మొదలైన, అనంతర కాలంలో అవతరించిన పూర్వాచార్యుల రచనలపై కూడా కూరేశుల పంచస్తవి ప్రభావం స్ఫుటంగా కనిపిస్తుంది.

## 13. కూరేశుల ఇతర రచనలు

కూరేశులు పంచస్తవినే కాకుండా, ఇంకా కొన్ని గ్రంథాలు రచించినట్లు కనబడుతున్నా, అవి ఏవీ మనకు లభించడం లేదు. కూరేశుల పుత్రులయిన పరాశర భట్టర్ శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రంలోని "**అవిజ్ఞాతా**" అనే నామాన్ని వ్యాఖ్యానిస్తూ, "**సర్వజ్ఞత్వమేవ ముపలభామహే త్వం హ్యజ్ఞ ఏవాశ్రిత దోష జోషణః**"– అనే శ్లోకభాగాన్ని ఉట్టంకించి, అది కూరేశుల కృతంగా తెలియజేశారు. అయితే, ఈ శ్లోకం కూరేశులు అనుగ్రహించిన పంచస్తవిలో ఎక్కడా కనిపించడం లేదు. అందువల్ల, కూరేశులు పంచస్తవినే

కాకుండా, ఇంకా కొన్ని శ్లోకాలను కానీ, కొన్ని కృతులను కానీ రచించి ఉండవచ్చు – అని తెలుస్తున్నది.

శ్రీరామానుజులు అనుగ్రహించిన గద్య త్రయానికి వీరు ఒక వ్యాఖ్యను రచించినట్లు ఆధారాలు ఉన్నవి కాని, అది ఇప్పుడు లభించడం లేదు.

కూరేశులు యమకరత్నాకరం అనే ఒక అద్భుతమైన, యమకాలలంకారమయమైన కావ్యాన్ని రచించి, దానికి స్వయంగానే ఒక వ్యాఖ్యానాన్ని కూడా రాసినట్లు కొంతమంది విమర్శకులు భావిస్తున్నారు. దీనికి కారణం, ఆ గ్రంథం ఆరంభంలో

**"ప్రణిపత్య పరమపురుషం శ్రీవత్సాంకః పరాశరాన్యాహ్వః,**
**స్వయమేవ యమకరత్నాకర వివృతిం కర్తు మారభతే"**

అని కూరేశుల ఇంకొక నామం అయిన శ్రీవత్సాంక పదం కూర్చబడి ఉండడం కావచ్చు. కానీ, అందులో చెప్పబడిన విషయాలు కొన్ని భగవద్రామానుజ సిద్ధాంతానికి అనుకూలంగా లేనందువల్ల, యమక రత్నాకర గ్రంథకర్తగా భావింపబడిన కూరేశులు భగవద్రామానుజుల అంతరంగ శిష్యులు అయినందువల్ల, వారి సిద్ధాంతాన్ని పరిపూర్ణంగా నమ్మినవారు కనుక ఆ గ్రంథాన్ని వారు రచించలేదు – అని కాంచీ అణ్ణంగరాచార్యస్వామివారు మొదలైన పండితులు అభిప్రాయపడ్డారు.

కూరేశ విజయం అనే ఇంకొక గ్రంథాన్ని కూడా వీరు రచించినట్లు కొందరు పొరపాటు పడ్డారు. ఈ కావ్యాన్ని కూరేశులు చోళరాజు సభలో శివపారమ్యాన్ని ఖండిస్తూ, విష్ణు పారమ్యాన్ని స్థాపిస్తూ, తాము చేసిన ఉపన్యాససారంగా అనుగ్రహించారని వారు భావించారు. కానీ, ఈ కావ్యం, కూరేశులచే రచింపబడినది కాదని నిశ్చితంగా చెప్పడానికి ఆ గ్రంథంలోని కూరేశులకు తరువాత జన్మించిన విద్యారణ్యుల ప్రస్తావన ఉండడమే చాలు.

బహుశః కూరేశ నామాన్ని కలిగిన, వేరొక, అనంతర కాలంలో జన్మించిన పండితుడు ఎవరో ఈ కావ్యాన్ని రచించి ఉండి ఉండాలి – అని విమర్శకుల అభిప్రాయం.

బుద్ధిస్తవం, కూరేశ విజ్ఞాపనం, నారాయణాష్టకం – అనే రచనలు కూడా కొందరు చెబుతున్నారు కాని, అవి ఇంతవరకు ఎక్కడా ముద్రింపబడినట్లు తెలియలేదు. విమర్శకులు, పండితులు ఎవరూ వాటిని కూరేశకృతంగా అంగీకరించలేదు.

## 14. దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో కూరేశుల అర్థనిర్వాహాలు

మన పూర్వాచార్యులు అందరూ సకల శాస్త్రాలలో అత్యంత ప్రవీణులుగా భాసించినవారు అయినప్పటికీ, దివ్యసూరుల దివ్య ప్రబంధ సూక్తుల అర్థగాంభీర్యంలో సదా నిమగ్నమై ఉండేవారు. సకల శాస్త్రార్థాలను వారు దివ్యసూరుల సూక్తుల ద్వారానే నిర్ణయం చేసేవారు. ఇటువంటి అనుభవం కూరేశులకు తలమునకలుగా ఉండేది. వారి అనుభవం ఆళ్వారుల అనుభవంవలె గభీరమైనది అయినందువల్ల, శ్రీరామానుజులు వీరిని **"ఆழ்వాన్!"** అని సంబోధించేవారట. అంటే, ఎల్లప్పుడూ భగవంతుని అనుభవంలో, అళ్వారులవలె, నిమగ్నమై ఉండేవారని అర్థం. ఇందువల్లనే వీరికి **"కూరత్తాழ்వాన్"** అనే పేరు సంప్రదాయంలో ప్రసిద్ధమైనది.

ఎన్నో దివ్య ప్రబంధ పాశురాల అర్థాలను వివరించేటప్పుడు వ్యాఖ్యాతలైన మన పూర్వాచార్యులు వీరు నిర్వహించిన సుందరమైన, అతి సుకుమారమైన అర్థనిర్వాహాలను చాలా ప్రామాణికంగా, ఆదరంగా ఉట్టంకిస్తారు. ఒకటి రెండు నిర్వాహాలు మాత్రం ఇక్కడ ఉదాహరణగా ప్రస్తావింపబడుతున్నాయి.

తిరువాయ్ మొழி ప్రబంధంలో, ఆళ్వార్లు నాయకీ భావాన్ని పొంది పాడిన దశకాలలో, "**మాశఱు శోది**" (5–3) అనే దశకం ఒకటి. ఈ దశకంలోని ఏడవ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ వ్యాఖ్యాత నంబిళ్ళై కూరేశులు అనుగ్రహించిన ఒక అర్థనిర్వాహాన్ని ప్రస్తావించారు.

ఒకనాడు కూరేశులు రాజేంద్ర చోళునకు ఈ దశకాన్ని అద్భుతంగా వివరిస్తున్నారు. అందులో ఆళ్వారులు "**కలైకొళగల్కుల్ తోழீ! నమ్ కణ్గళాల్ కండు, తలైయిల్ వణంగవుమాంగొలో! తైయలార్ మున్బే**" (కోకను ధరించినది, విశాలమైనది అయిన నితంబ ప్రదేశాన్ని కలిగిన ఓ చెలీ! మనం, మన కన్నులతో స్వామిని దర్శించి, మన విషయంలో నిందలను పలికేవారి ఎదుటనే స్వామి తలతో నమస్కరించడం మనకు సాధ్యపడుతుందా?) అనే సూక్తిని వివరించేటప్పుడు, ఆ సభలో ఉండే, "**ఆమరువి నిరై మెయ్ త్తాన్ నంబియార్**" అనే ఒక వృద్ధుడు లేచి, కూరేశుల దగ్గరకు వచ్చి, "స్వామీ! నాయకి పాశురం అయిన ఈ సందర్భంలో, నాయకి తన చెలికత్తెను పిలచి, 'నీవు నాయకుని దగ్గరకు పోయి అతనిని చూచి అతనిని తలతో నమస్కరించు' – అని అనడం సరిగా కనబడలేదే! ఇది ఏ విధంగా సరి అయినది? ఉత్తమ నాయకి ఈ విధంగా శిరస్సు వంచి, నమస్కరించడం తగినదేనా?" – అని ప్రశ్నించాడు.

అప్పుడు కూరేశులు "అవును. సరి అయినదే. ఆ విధంగా నమస్కరించే సంప్రదాయం ఉన్నది. ఇంతకు ముందు ఈ విధంగా నమస్కరించినవారు కూడా ఉన్నారు. రావణుని కారణంగా శ్రీరామచంద్రునకు దూరమై అశోకవనంలో బంధింపబడిన సీతాదేవి హనుమంతునితో పలికేటప్పుడు–

**"కౌసల్యా లోకభర్తారం సుషువేయం మనస్వినీ,**

**తం మమార్థే సుఖం పృచ్ఛ శిరసా చాభివాదయ"**

**(శ్రీరామాయణం –సుందరకాండ– 38 –50)**

(మంచి మనస్సును కలిగినది అయిన కౌసల్య లోకానికంతటికి భర్త అయిన ఏ కుమారుని కన్నదో, అతని క్షేమాన్ని నా పక్షంగా విచారించు. నా తలతో నేను అతనికి నమస్కరించినట్లుగా కూడా చెప్పు) అని అన్నది కదా. అందువల్ల నాయకి తలతో నమస్కరించడం అనే సత్సంపదాయం అనేది ఒకటి ఉన్నది– అని తెలుస్తున్నది కదా" అని బదులు చెప్పారు.

"ఈ విధంగా సీతాదేవి నమస్కరించినట్లుగా చెప్పడం ప్రణయ రోషం వల్ల కోపం తల ఎత్తి చెప్పిన మాటనా? లేక, నమస్కరించాలి –అనే కోరికతో చెప్పిన మాటనా?" అని మళ్ళీ ప్రశ్నించగా, "మొదట హనుమంతుడు వచ్చినపుడు ప్రణయ రోషం వల్ల ఏర్పడిన కోపంతో చాలా కఠినంగా కొన్ని మాటలను సీతాదేవి పలికింది. ఆమె కోపం అంతా తీరేటట్లుగా హనుమంతుడు కొన్ని చల్లని మాటలను చెప్పగా, వాటిని విన్న సీతాదేవికి మనసులో ఉండే కోపం అంతా ఉపశమించి, ఊరట కలిగింది. అయితే, శ్రీరాముని తాను కలువలేకపోయినందు వల్ల కలిగిన కొరత ఆమె మనసులో ఇంకా ఉన్నది. అందువల్ల ఈ విధంగా హనుమంతునితో ఒక మాటను సీతా దేవి పలికింది" అని కూరేశులు బదులు పలికారు.

ఇటువంటి అద్భుతమైన కూరేశనిర్వాహాలు ద్రావిడ ప్రబంధ వ్యాఖ్యానాలలో సుమారు 50కి పైగా కనిపిస్తాయి. ఇవి అన్నీ కూరేశుల లిఖిత రచనలు కాకపోయినాప్పటికీ, వారి వాగ్రూపాలే కనుక, వారి రచనలుగా భావించడంలో ఏ అడ్డు లేదుకదా.

# 15. దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో పంచస్తవి

ఈ సందర్భంగా, పంచస్తవికి సంబంధించిన ఇంకొక ఆశ్చర్యకరమైన అంశం కూడా ప్రస్తావించదగినది ఉన్నది. మన పూర్వాచార్యులు పలువురు ఆళ్వారుల దివ్యప్రబంధాలను వ్యాఖ్యానించేటప్పుడు, పంచస్తవిలోని కూరేశుల సూక్తులను ప్రమాణంగా ఉదాహరించిన సందర్భాలు సంఖ్యలో 150కి పైగా కనిపిస్తాయి. ఉదాహరణకు ఒక్క సందర్భాన్ని మాత్రం ప్రస్తావిస్తాను.

తిరువాయ్ మొ*ழி* దివ్య ప్రబంధంలో నమ్మాళ్వారులు, మొట్టమొదటి పాశురంలోని మొదటి పాదంలో, భగవానుని "**ఉయర్వఱ ఉయర్ నలమ్. ఉడైయవన్ యవన్**" (ఏ విధమైన తక్కువదనం లేని ఔన్నత్యాన్ని కలిగిన కళ్యాణ గుణాలను సహజంగా కలిగినవాడు, ఎవడో) అని అంటూ భగవంతుడు సాటి మేటి లేని గొప్పతనాన్ని కలిగిన కళ్యాణ గుణాలను కలిగినవాడని అన్నారు.

వెంటనే ఇక్కడ ఒక ప్రశ్న కలుగుతుంది. లోకంలో ఉండే వ్యవస్థను చూసినప్పుడు, ఒక వస్తువుకు కల గొప్పతనం, ఆ వస్తువులో ఉండే గుణాతిశయాన్ని బట్టిఉంటుంది. ఆ విధంగానే, ఇక్కడ కూడా,భగవంతునిలో ఉండే గొప్పతనం ఆ స్వామికి కల కళ్యాణ గుణాల వల్ల ఏర్పడినదా? అనే సందేహం ఏర్పడే అవకాశం ఉన్నది. దానిని పరిహరిస్తూ నంబిళ్ళై "**అగ్గుణంగళుమ్ తన్నై ప్ప*ఱ్ఱి* నిఱుమ్ పెఱువేండుమ్బడియా యిరుక్కిఱ దివ్యాత్మ స్వరూప వైలక్షణ్యత్తై క్కాట్టి ఉపకరిత్తాన్**" (ఆ గుణాలు కూడా, తనను ఆశ్రయించి ఉత్తర్షను పొందే విధంగా ఉండే తన దివ్యాత్మస్వరూప వై లక్షణ్యాన్ని దర్శింప చేసి, నన్ను అనుగ్రహించాడు) అనే వివరణను చేశారు. ఈ విధమైన వివరణను నంబిళ్ళై అనుగ్రహించడానికి ఆధారం ఏది అంటే? పై ఆళ్వారుల సూక్తిలోని విశేష్య పదమైన"యవన్" అనే సర్వనామ

శబ్దప్రయోగమే అని నంబిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో వివరించారు. సర్వనామ శబ్దాలకు వక్తృవివక్షను అనుసరించి, సందర్భానికి అనుగుణమైన, ఆవశ్యకమైన అర్థాన్ని వ్యక్తం చేసే శక్తి ఉన్నది కదా. పరమ వైదికులైన, వేదపురుషుని హృదయాన్ని పరిపూర్ణంగా గ్రహించినవారైన నమ్మాళ్వారుల సూక్తిలోని ఈ "**యవన్**" అనే సర్వనామ శబ్దం భగవద్వైభవాన్ని తెలియజేసేది అయినందున, భగవంతుడు, లోక విసదృశమైన స్వభావాన్ని కలిగినవాడు అయినందున, "తన కళ్యాణగుణాల వల్ల అతిశయాన్ని పొందవలసిన అక్కరను కలిగినవాడు కాడు, సహజంగానే అంతు లేని వైభవాన్ని కలిగినవాడు" – అనే సందర్భోచితమైన, ఆవశ్యకమైన అర్థాన్ని "**యవన్**" అనే ఈ సర్వనామ శబ్దం సూచిస్తున్నదని ఇక్కడ తాత్పర్యం.

ఈ విధంగా వ్యక్తమవుతున్న ఈ అర్థానికి సంవాదప్రమాణంగా రెండు అరుంబదాలలోనూ కూరేశుల శ్రీవరదరాజస్తవంలోని–

**"గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదం**
**విపర్యస్తం హస్తిక్షితిధరపతే!తత్ త్వయి పునః,**
**గుణాః సత్యజ్ఞానప్రభృతయ ఉత త్వద్గతతయా**
**శుభీభూయం యాతా ఇతి హి నిరణైష్మ శ్రుతివశాత్"**(11)

(ఓ వరదరాజస్వామీ! లోకంలో గుణాలు కలవారి విషయంలో "వీరు గుణవంతులు" అనే ప్రసిద్ధి అనేది వారిలో ఉండే మంచి గుణాలను బట్టి కదా, కలుగుతున్నది. అటువంటి ఆ మంగళ పదం, ఈ విషయంలో అయితే, వేరే విధంగా ఉన్నది. నీ మంగళత్వం నీ కళ్యాణ గుణాల వల్ల ఏర్పడినది కాదు. అది నీకు సహజమైనది. ఎందుకంటే, సత్యం, జ్ఞానం మొదలైన నీ గుణాలు నిన్ను పొందినందు వల్లనే మంగళ స్వభావాన్ని పొందుతున్నాయి – అని " సత్యస్య సత్యం, జ్యోతిషాం జ్యోతిః "అని మొదలైన వేదసూక్తులను బట్టి మేము నిర్ణయించాము. . అందువల్ల, నీ సంబంధం చేత గుణాలకు మంగళత్వమే

కానీ, గుణాల వల్ల నీకు మంగళ పదం కలుగలేదు) అనే శ్లోకం ఉదాహరింపబడింది.

మరి ఒక మధురమైన సందర్భాన్ని చూద్దాం. నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలో "*அற்றது பற்றெனில்*"(1-2-5) అనే పాశురంలో భగవంతుని ఆశ్రయించేటపుడు ఎదురయ్యే ఆటంకాలను గూర్చి ప్రస్తావించారు. దీనిని నంబిళ్ళచ వ్యాఖ్యానిస్తూ "భగవంతుని ఆశ్రయించేటప్పుడు ఎదురయ్యే అంతరాయాలను గూర్చి పలుకుతున్నారు ఇంద్ర పదవిని ఆశించేవాడు ఈ లోకంలో ఉండే ఐశ్వర్యాన్ని కోరడు బ్రహ్మ పదవిని ఆశపడేవాడు ఆ పదవికి కింద ఉండే కింద పదవిని ఆశపడడు ఆత్మానుభవాన్ని ఆశపడేవాడు బ్రహ్మాది పదవుల రూపంలో అని ఐశ్వర్యాన్ని ఆశపడడు సమస్త కల్యాణ గుణాత్మకుడై దివ్య మంగళ విగ్రహాయుక్తుడై వుండే పరమాత్మను ఆశ్రయించే వాడు వీటిని వేటిలోనూ దృష్టి పెట్టడు. ఈ విధంగా ఎదురయ్యే అంతరాయాలకు పరిహారాన్ని ఈ పాశురంలో అనుగ్రహిస్తున్నారు" అని వివరించారు.

ఈ వ్యాఖ్యానాన్ని వివరించే అరుంబదాలు రెండిటిలోను కూరేశులు అనుగ్రహించిన శ్రీవరదరాజస్తవంలోని –

**"భోగా ఇమే విధి శివాదిపదం చ కించ**
**స్వాత్మానుభూతి యా కిల ముక్తి రుక్తా,**
**సర్వం తదూష జల జోష మహం జుషేయ**
**హస్త్యద్రినాథ! తవ దాస్య మహారసజ్ఞః**"(81)

(హస్తిగిరినాథా! నీ దాస్యం లోని గొప్ప రసాన్ని తెలిసిన నేను, ఈ లోకంలో ఉండే భోగాలను కానీ, సృష్టికర్త అయిన బ్రహ్మ,లయాన్ని నిర్వహించే శివుడు,మొదలైన వారి పదవులను కానీ, ఇంతే కాక, కైవల్యం అనబడే

ఆత్మానుభవాన్ని కానీ, వీటిని అన్నిటిని ఉప్పునీటితో సమానంగా అంటే అసారాలుగా భావిస్తున్నాను) అనే శ్లోకాన్ని ఉదాహరించారు. సమస్త కళ్యాణ గుణాత్మకుడైన, దివ్య మంగళ విగ్రహుడైన భగవంతుని కైంకర్యంలోని మాధుర్యాన్ని తెలిసినవారికి పైన తెలిపిన పదవులన్నీ భగవత్సేవకు ఆటంకాలే అవుతాయి కదా. చక్రవర్తి అయిన కుల శేఖరులు కూడా తమ ప్రబంధంలో **"ఊనేఱు శెల్వత్తు"** అనే దశకంలో ఈ భావాన్ని వ్యక్తం చేయడం, **"వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు, తస్యాంతరాయో మైత్రేయ! దేవేంద్రత్వాదికం ఫలమ్"** (జపం, హోమం, అర్చన మొదలైన సేవలను చేసేటప్పుడు ఎవని మనస్సు భగవంతునిలో లగ్నమై ఉంటుందో, అతనికి దేవేంద్ర పదవి మొదలైన ప్రయోజనాలు అన్ని కూడా అతడు చేసే భగవత్సేవకు ఆటంకాలే అవుతాయి) అనే శ్రీ విష్ణు పురాణ శ్లోకం (1–6–41) కూడా ఇదే విషయాన్ని తెలుపడం ఇక్కడ గమనించదగినది.

ఇటువంటి రీతిలో మన పూర్వాచార్యులు తమ కృతులలో పంచస్తవీసూక్తులను ఎన్నో సందర్భాలలో పరమప్రమాణాలుగా ఎంతో ఆదరంగా గ్రహించారు.

## 16. రహస్య గ్రంథాల వ్యాఖ్యానాలలో పంచస్తవి

శ్రీపిళ్లై లోకాచార్యులవారు ఉభయ వేదాంత తత్వార్థాలను సమీకరించి, అష్టాదశ రహస్యాలు అనే 18 రహస్య గ్రంథాలను వెలయించారు. వాటిలో, ముముక్షుప్పడి, తత్వత్రయం, శ్రీ వచన భూషణం అనే మూడు గ్రంథాలను శ్రీవరవరమునులు వ్యాఖ్యానిస్తూ, ఆ యా సందర్భాలలో కూరేశుల పంచస్తవిలోని సూక్తులను ప్రమాణాలుగా ఉదాహరించడం మనకు కనిపిస్తుంది. విస్తరణ భయం వల్ల ఒక ఉదాహరణను మాత్రం ప్రస్తావించడం జరుగుతున్నది.

శ్రీవచన భూషణంలోని 17వ సూత్రం ఇది. ఇందులో పిళ్లై లోకాచార్యులవారు "ఇరండుమ్ కులైందదు ఎన్ను ఇరుక్కిల్ ఇత్తలైక్కు ఇరండుమ్ ఉండాత్తదామ్" అని అనుగ్రహించారు.

దీని భావం ఏమంటే, "ఇంత కాలంగా దివ్య దంపతులు మనలను అంగీకరించకుండా ఉండడం, ఇప్పుడు అంగీకరించడం ఎందుకంటే, మన దోషాలు, గుణలోపాలు తీరిపోయాయి కదా. అందువల్లనే పారుమనలను అంగీకరించారు అని భావిస్తే, అకృత్య కరణం, కృత్యా కరణం అనే రెండు దోషాలు మనకు ఏర్పడతాయి- అని భావం. దీని తాత్పర్యం ఏమంటే, అనాదికాలంగా నన్ను అనుగ్రహించని దివ్య దంపతులు ఈ నాడు నన్ను పరిగ్రహించడం ఎందువల్లనంటే, నా దోషాలు, గుణలోపాలు తీరిపోయినందు వల్లనే" -అని భావించడం వల్ల చేయకూడని పనిని చేసినట్లు అవుతుంది, చేయవలసిన పనిని చేయనట్లు అవుతుంది. నాలో అన్ని దోషాలు ఉన్నాయి- అని భావించనందువల్ల చేయవలసిన పనిని చేయనట్లు అవుతుంది, నాకు ఏ గుణం లేదు -అని భావించనందువల్ల చేయవలసిన పనిని చేయనట్లు అవుతుంది – అని.

దీనిని వివరిస్తూ శ్రీ వరవరమునులు తమ వ్యాఖ్యానంలో శ్రీవరదరాజస్తవంలోని

**"బుద్ధ్వా చ నో చ విహితాకరణైః నిషిద్ధ-**
**సంసేవనైః త్వదపచార శతై రసహ్యైః,**
**భక్తాగసామపి శతైః భవతా ఽ ప్యగణ్యైః**
**హస్తీశ! వాక్తనుమనోజనితైః హతో ఽ స్మి."** (79)

(వరదరాజస్వామీ! నేను, తెలిసి తెలియక, వాక్కుతో, శరీరంతో, మనస్సుతో చేసినవి, సర్వశక్తివి అయిన నీకు కూడా లెక్కపెట్టడానికి సాధ్యం కానివి, విధింపబడిన కర్మలను చేయకపోవడం, శాస్త్రంలో నిషేధింపబడిన

కర్మలను చేయడం— అకృత్య కరణ కృత్యా కరణాలనే పాపాల వల్ల, నీ విషయంలో చేసే అనేక విధాలయిన అపచారాల వల్ల, అన్నిటినీ సహించే స్వభావాన్ని కలిగిన నీవు కూడా సహించలేని పలు విధాలయిన భాగవతాపచారాల వల్ల, నేను చెడిపోయాను. అయ్యో!) అనే శ్లోకాన్ని ఉదాహరించారు.

ఈ శ్లోకంలో కూరేశులు రెండు విధాలయిన దోషాలు తమలో ఉన్నట్లుగా ప్రస్తావించారు కదా. ఈ విధంగానే, ఎన్నో పంచస్తవి సూక్తులను శ్రీవరవరమునులు తత్త్వత్రయ వ్యాఖ్యానంలోనూ ప్రమాణాలుగా ఉదాహరించారు. వేదాంతదేశికులు కూడా రహస్య త్రయసార గ్రంథంలో పలుచోట్ల పంచస్తవి సూక్తులను ప్రమాణాలుగా ఉదాహరించారు. ఈ ఉదాహరణలు అన్నీ పంచస్తవి పరమప్రామాణ్యానికి తిరుగులేని సాక్ష్యాలు.

ఇక, చివరిగా, పంచస్తవిలోని సాహిత్య సౌందర్యాన్ని స్థాలీపులాకంగా ప్రస్తావించడం జరుగుతున్నది.

## 17. పంచస్తవిలోని సాహిత్యసౌందర్యం

శ్రీ కూరేశులు గొప్ప దార్శనికులే కాకుండా, సహజంగానే సుమధుర కవిత ప్రణయన శక్తిని, నైపుణ్యాన్ని, లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణాన్ని కలిగినవారు కనుక, వారి పంచస్తవి కేవలం స్తోత్రాల రూపంగానే కాకుండా, సుమధుర ప్రబంధాలుగాకూడా రూపొందాయి అందువల్ల వారు అనుగ్రహించిన స్తోత్రం ఉత్తమ కవితా లక్షణాలు బాసిస్తాయి. సందర్భానుగుణమైన పదప్రయోగ చాతుర్యం, చెప్పదలచిన అర్థాన్ని చమత్కారంగా చెప్పగలిగిన నేర్పు ఆ విధంగా చెప్పేటప్పుడు పలు అలంకారాలను మేళవించి రసబంధురంగా, రసజ్ఞ మనోహృద్యంగా శ్లోకాలను రూపొందించగలిగిన చాకచక్యం, చక్కని పదాల కూర్పు మొదలైన ఉత్తమ కావ్య లక్షణాలు, వీటితో పాటు, కావ్యానికి

ఆత్మస్థానీయంగా కీర్తింపబడే ఉత్తమ ధ్వన్యర్థాలు మొదలైనవి అన్నీ ఈ పంచస్తవిలో సాహిత్య విమర్శకులకు సర్వత్ర సాక్షాత్కరిస్తాయి. కేవలం సంగ్రహంగా కొన్ని అంశాలను మాత్రం ఇక్కడ ప్రస్తావించడం జరుగుతున్నది.

కావ్య వృత్తులలో కైశికీ వృత్తి అనే ఒక వృత్తి ఉన్నది. చాలా సుకుమారమైన అర్థసందర్భాలను వర్ణించడానికి ఈ వృత్తిని కవులు ప్రయోగిస్తారు. " అత్యర్థ సుకుమారార్థ సందర్భా కైశికీ మతా" అని ఈ విషయాన్ని ప్రతాపరుద్రీయ కారుడు కూడా చెప్పాడు. ఈ వృత్తి కరుణ శృంగార రసాల పోషణకు ఉపకరిస్తుంది. దీనిని వరదరాజస్తవంలోని "పద్మాయాః ప్రణయరసాత్ సమాసజంత్యాః--"(41) అనే శ్లోకంలో గమనించవచ్చు. క్షీరసాగర మథనసందర్భంలో అవతరించిన లక్ష్మీదేవి భగవానుని చూచి మోహంతో ఆ స్వామి కంఠాన్ని ఆలింగనం చేసుకొన్న ఇక్కడ సంఘటన వర్ణింపబడడం వల్ల ఇందులో శృంగారస పోషణ కోసం ఈ వృత్తి ప్రయోగింపబడింది.

కొంచెం సుకుమారమైన అర్థ సందర్భాన్ని వర్ణించడానికి కవులు భారతీ వృత్తిని ప్రయోగిస్తారు. "**ఈషన్మృద్వర్థసందర్భా భారతీ వృత్తిరిష్యతే**" అని నిర్వచింపబడిన ఈ వృత్తి హాస్య శాంత అద్భుత రస పోషణకు ఉపకరిస్తుంది. దీనిని పంచస్తవిలోని అతిమానుషస్తవంలో గల "**యన్నామ నాథ నవనీత మచూచుర స్త్వం తచ్ఛాదనాయ యది తే మది రావిరాసీత్**" (39) అనే శ్లోకంలో చూడవచ్చు. ఇందులో హాస్యరస పోషణ కోసం ఈ వృత్తి ఉపయోగించబడింది.

సాహిత్య శాస్త్రంలో రీతి అంటే, గుణాలతో కూడుకున్న పదాల సంఘటన. ఇది వైదర్భీ, గౌడీ,పాంచాలీ అని మూడు విధాలు. వివిధ కవితారీతుల ప్రయోగాన్ని కూడా పంచస్తవిలో గమనించవచ్చు. "బంధపారుష్యరహితా శబ్ద కాఠిన్యవర్జితా, నాతి దీర్ఘ సమాసా చ వైదర్భీరీతి

రిష్యతే" అని చెప్పబడిన వైదర్భీరీతి బంధ పారుష్యం లేకుండా, శబ్ద కాఠిన్యం లేకుండా, పెద్ద పెద్ద సమాసాలు లేకుండా ఉంటుంది దీనిని శ్రీ వైకుంఠస్తవంలోని "యన్మంగళాయ మహతే జగతాముశంతి" అనే శ్లోకంలో గమనించవచ్చు. ఆ విధంగానే సమాసమయమైన ఓజస్సు అనే గుణాన్ని బంధం ఉజ్వలంగా ఉండడం అనే కాంతి అనే గుణాన్ని కలిగినది గౌరీ గౌరీ రీతి దీనిని శ్రీ వైకుంఠస్తవంలోని "త్రైవిద్య వృద్ధ జనమూర్ధ విభూషణం యత్"అనే శ్లోకంలో (3) చూడవచ్చు.

ఇక, పంచస్తవిలోని శబ్దాలంకారాలను చూస్తే, వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస మొదలైన శబ్దాలంకారాలు "**యత్తుంగశృంగ---**", "**అరాళాం పాతాళమ్--**" అని మొదలైన చాలా శ్లోకాలలో కనిపిస్తాయి. అర్థాలంకారాలు అయితే, లెక్కలేనన్ని దర్శనమిస్తాయి. అలంకారాలకు అన్నిటికీ మాతృక వంటి ఉపమాలంకారం అయితే, పంచస్తవిలో పలుమార్లు ప్రయోగింపబడింది. దీనిని "**న్యాయ స్మృతి --**" (వైకుంఠస్తవం -15) "**సుచారు చాపద్వయ---**" (సుందర బాహుస్తవం- 42) మొదలైన చోట్ల గమనించవచ్చు. ఉత్ప్రేక్ష "**శ్రీమత్పరాంకుశ**" (అతిమానుషస్తవం - 3) అనే శ్లోకంలో చూడ వచ్చు. విరుద్ధ కార్యోత్పత్తిని వర్ణించడం అనే లక్షణాన్ని కలిగిన విభావనాలంకారాన్ని అయితే, "**ఏతత్కథం కథయ**" (36) అనే శ్లోకంలో చూడవచ్చు. ఇవి కేవలం ప్రాయికాలైన ఉదాహరణలు మాత్రమే.

ఆళ్వారుల దివ్య ప్రబంధాలలో ప్రత్యేకించి పరాంకుశ సూరి, కలివైరి సూరి, భక్తనాథ సూరి గోదాదేవి అనుగ్రహించిన దివ్య ప్రబంధాలలో ఒక్కొక్క దశకంలో ఒక్కొక్క విధమైన వృత్త ప్రయోగం గోచరిస్తుంది ఇటువంటి వృత్త వైవిధ్యాన్ని అనుసరిస్తూ కురేశులు కూడా తమ పంచస్తవిలో పలు వృత్తాలను ఆయా సందర్భాలకు అనుగుణంగా ప్రయోగించడాన్ని గమనించవచ్చు. శ్రీరామాయణం, రఘువంశం, మాఘం, కిరాతార్జునీయం మొదలైన

సంస్కృత కావ్యాలలో కూడా ఒక్కొక్క సర్గలో, ఒక్కొక్క అధ్యాయంలో ఒక్కొక్క విధమైన వృత్త ప్రయోగం గోచరిస్తుంది. ఇది కవికి కల వివిధ వృత్త ప్రయోగ చాతురిని. చాటుతుంది. భగవానుడు చతుర్గతి అనే పేరుతో కీర్తింపబడుతున్నాడు. సింహగతి, గజగతి,వ్యాఘ్ర గతి, వృషభగతి అనే నాలుగు విధాలయిన గతులలో శ్రీరాముడు తన నడకలోని హొయలును ప్రదర్శిస్తాడు అని వాల్మీకి మహర్షి రామాయణంలో అన్నాడు. భగవంతుని ప్రమేయంగా కలిగినది కనుక పంచస్తవిలో ఉరేషులు ఈ విధమైన వృత్త వైవిధ్యాన్ని చూపడం చాలా సముచితం ఈ విశేషాన్ని ప్రత్యేకంచి శ్రీ వరదరాజస్తవంలో విశేషంగా గమనించవచ్చు ఈ స్తుతిలో ఒక్కొక్క దశకం ఒక్కొక్క వృత్తంలో రచింపబడింది.

వరమ రమణీయాలైన ధ్వన్యర్థాల వ్యక్తీకరణ కూడా పంచస్తవిలో మనకు ప్రస్ఫుటమవుతుంది. ఈ విశేషాన్ని కాంచీ అణ్ణంగచార్య స్వామివారు వరదరాజస్తవ్యాఖ్యానంలో వివరించారు. తత్వార్థ చింతామణి అనే వారి వ్యాఖ్యానంలో" ముఖమున్నస మాయతాక్షమ్––" అనే, వరదరాజస్తవంలోని 40 వ శ్లోకాన్ని వ్యాఖ్యానించేటప్పుడు "కూరేశుల చిత్తం అనే కన్యక వరదరాజ స్వామి కంఠాన్ని ఆలింగనం చేసుకోవడానికి వెళ్ళబోతున్నది కనుక, కొత్తగా వివాహిత అయిన కన్యక పుట్టింటిలో నుండి మెట్టినింటికి వెళ్లేటప్పుడు, తాను పుట్టిన చోట ఉండే బంధుమిత్రులు ఉండే చోటుకు అంతటికి వెళ్లి, వారిని పలకరించి సముదాయించి వచ్చేటట్లే, తనకు చిరపరిచితాలైన వరదరాజస్వామి నేత్రాలు,నాసిక మొదలైన అవయవాలను కంఠాలింగనానికి పూర్వాగంగా ఉపలాలించి, ఆనందిస్తున్నది – అని జీయర్ అనుగ్రహించేవారు "అని వివరించడం ఇక్కడ గమనించవచ్చు. పంచస్తవిలో భాసించే ఇటువంటి అందమైన భావనలు రసజ్ఞహృదయ చిత్తాలను తప్పక రంజింప చేస్తాయి.

## పంచస్తవి వైభవం

కవి ఎప్పుడు కూడా సమాజానికి సమకాలీన సంఘటనలకు పరిస్థితులకు అతీతుడు కాబోలు కాలేడు కూడా అతడు వెలగించే కవిత్వంలో ఆ కాలంలో ఉండే సాంఘిక వ్యవస్థ అందులోని సమస్యలు దానికి తగిన పరిష్కారాలు మొదలైనవి కనిపించడం సహజం ఈ క్రమాన్ని పంచస్తవిలో కూడా మనం గమనించవచ్చు.

కూరేశులు పంచస్తవిని అనుగ్రహించడానికి ప్రోత్సహించిన సంఘటన, వారి చరిత్రను బట్టి చూసినట్లయితే చోళరాజు సభలో జరిగిన దారుణమైన దుర్ఘటనయే కదా. దానివల్ల తాము తమ ఆచార్యులైన రామానుజులకు దూరమైపోవలసి రావడం వారికి చాలా బాధను కలిగించింది. ఆ విధమైన సమస్యలు అన్ని సర్దుకొని, మళ్ళీ తిరిగి రామానుజుల సన్నిధిలో తాము కాలాన్ని గడుపగలిగేటట్లు, శ్రీరంగంలోని శ్రీ వైష్ణవ సంపద మళ్లీ తిరిగి పూర్వం వలె సమృద్ధం అయ్యేటట్లు అనుగ్రహించవలసినదిగా కూరేశులు సుందరబాహుస్తవం చివరిలో పలు శ్లోకాలలో (129, 130, 131,132) ప్రార్థించడం గోచరిస్తుంది. ఇది అంతా అప్పటి సమస్యలను మన కంటి ముందు నిలుపుతుంది.

ఈ రీతిగా గమనించి చూస్తే, పంచస్తవి పలు ఉత్తమ కావ్య లక్షణాలకు చక్కని లక్ష్యంగా భాసిస్తున్నది.

# 18. కూరేశుల వివిధశాస్త్రవైదుష్యం

కూరేశుల వివిధశాస్త్రపాండిత్యంకూడా పంచస్తవిలో వ్యక్తం అవుతున్నది. "వ్యోమాంభోజ మిదంతయా కిల విదన్ భ్రాంతోఽయ మిత్యుచ్యతే" అనే సూక్తి వీరి తర్కశాస్త్రవైదుష్యాన్ని, **"నేత్రసాత్కురు"**, **"పిశునయన్"**, **"కౌతస్కుతాః"**, **"తేరిథ, జిగ్యిథ"**, **"పారణీయతి"** ఇత్యాది విశిష్ట ప్రయోగాలు వ్యాకరణ శాస్త్ర పాండిత్యాన్ని, **"పిత్తఘ్న మంజన**

**మనాప్నుషి జాతు నేత్రే నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః**" ఇత్యాదులు వైద్యశాస్త్రపరిచయాన్ని, "**వ్యాఖ్యాతో గతిసామ్యలబ్ధ విషయానన్యత్వ బోధోజ్జ్వలైః**" ఇత్యాది సూక్తులు వేదాంత శాస్త్రపాటవాన్ని ఋజువు చేస్తున్నాయి. "**పతిం విశ్వస్యాత్మేశ్వరమ్**", "**జ్యోతిః పరమ్ పరమతత్త్వమ్**", "**పృథివ్యాద్యాత్మాంతమ్**" ఇత్యాది శ్లోకాలను వీరు ఉపనిషత్సూక్తులను యథాతథంగా అనువదిస్తూ రచించిన సొబగు సహృదయైకవేద్యం. వీరి విశిష్టమైన లోకానుభవాన్ని, ఝటితిస్ఫూర్తిని "**యుక్తో విధేయవిషయేషు హి కామచారః**", "**సర్వో హి వశ్యవిషయే వివృణోతి వీర్యమ్**", "**న హి చకోర్యేకాఖిలాం చంద్రికాం నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి**", "**సర్వం గుణాయ గుణినా మితి సత్య మేతత్**" ఇత్యాది ప్రయోగాలు తెలుపుతున్నవి.

## 19. పంచస్తవిలో వృత్తౌచిత్యం

కూరేశులు వృత్తౌచిత్యాన్ని పాటించిన సందర్భాలుకూడా ఎన్నో ఉన్నాయి. మకుటమాల, వనమాల, ఆయుధ మాలలను వర్ణిస్తూ కూరేశులు సుందరబాహుస్తవంలో మాలినీవృత్తాన్ని (38) ప్రయోగించడం, గరుడుని రథోద్ధతావృత్తంలో వర్ణించడం, "**మధురాభాషి**" అయిన శ్రీరాముని మంజుభాషిణీ వృత్తంలో వర్ణించడం ఇందుకు కొన్ని నిదర్శనాలు. ఇటువంటివి చాలా ఉన్నాయి.

పంచస్తవిలో కొన్ని చారిత్రక ఘట్టాల సూచనలు కూడా చోటు చేసికోవడం విశేషం. తిరుక్కచ్చినమ్బికి పితామహులుగా చెప్పబడే హరితవారణభృత్యునకు (పచ్చెవారణదాసుడు) వరదరాజ స్వామి దృష్టిని ప్రసాదించాడనే ఐతిహ్యం "**హరితవారణభృత్యసమాహ్వయమ్**" (126) అనే శ్లోకంలోను, మలయధ్వజుడనే పాండ్యదేశ ప్రభువు కాశీయాత్రకై ప్రయాణిస్తూ, దారిలో వనగిరిలోని సుందరబాహుస్వామి, నూపురగంగల

వైభవాన్ని స్వామి ద్వారానే విని, వారిని దర్శించి, గంగాస్నాన మనోరథాన్ని విడచిన ఐతిహ్యం. "**ఇద మిమే శ్రుణుమో మలయధ్వజమ్**" (128) అనే శ్లోకంలోను ప్రస్తావింపబడ్డాయి.

★★★★★★

**పీయూషం గరుడధ్వజాశ్రయసతాం పంచస్తవీనామకం**
**కూరేశార్యహృదబ్ధితః సముదితం సంసారిసంతారకమ్,**
**ఏతద్యైః హృది భక్తితః ప్రతిదినం సంభావ్యతే మానసే**
**బ్రహ్మానందం మిహైవ తైః రనుకలం ధన్యాత్మభిః ప్రాప్యతే.**

గరుడధ్వజుడు అయిన భగవానుని ఆశ్రయించిన సత్పురుషులకు అమృతంవంటిది, కూరేశుల హృదయం అనే సముద్రం నుండి ఉదయించినది, సంసారులను సంసారసముద్రం నుండి ఉద్ధరించేది అయిన పంచస్తవిని ఎవరు ప్రతిదినం భక్తితో తమ మనసులో సంభావన చేస్తారో, ధన్యాత్ములైన వారు ప్రతిక్షణం ఇక్కడే ఈ లోకంలోనే బ్రహ్మానంధాన్ని అనుభవిస్తారు.

